శ్రీనివాస బాలభారతి - 37

# ద్రోణాచార్యులు

రచన

డాక్టర్ కె.యస్. రామమూర్తి

ప్రధానసంపాదకుడు

డాక్టర్ ఎస్.బి. రఘునాథాచార్య



ప్రచురణ

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

2004

ŚRĪNIVĀSA BĀLABHĀRATI - 37
(Children Series)

# DRONACHARYULU

By
**Dr. K.S. Ramamurthy**

Chief-Editor:
Dr. S.B. Raghunathacharya

T.T.D. Religious Publications Series No.:167

First Edition : 1983
Re-print : 2004

Copies: 10,000

*Published by*
Sri Ajeya Kallam, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

Art : SILA VIRRAJU
Illustrations : CHAYA

*Printed at*
Keerthi Offset, TPT, Ph: 2229344

# ముందుమాట

ఒక తోట అందంగా కనులకు విందుచేయాలంటే, ముందు అందులోని పూలమొక్కల్ని చక్కగా పెంచాలి. సమాజం సుందరంగా రూపొందాలంటే భావిభారతపౌరులైన బాలలు సంస్కారంతో పెరగాలి. మన సంస్కృతి గొప్పదనం వారికి తెలియనంతకాలం వారెన్ని విద్యలు సాధించినా ప్రయోజనం శూన్యం. "మహా పురుషులు, మహాపతివ్రతలు మన జాతి కెందుకు గర్వకారణమైనారు? వారినుంచి మనం ఏ ఆదర్శాన్ని నేర్చుకోవాలి?" అనే విషయాన్ని వారి కథను చెబుతూ మన చిన్నారి బాబులకు, పాపలకు చెప్ప గలిగితే వారికి మనమెంతో సంస్కృతి సంపదనిచ్చిన వారమౌతాం. అలా సంస్కారంతో పెరిగిన బాలలు, తమ జీవితంలో ఎంతో మంచిని పెంచుకొని ఈ సమాజానికి ప్రేమను పంచుతారు. ఉత్తమ పౌరులై వారి కుటుంబానికేకాక, ఈ దేశానికి గూడ పేరు ప్రతిష్ఠలను సంపాదిస్తారు.

తిరుమల తిరుపతి దేవస్థానం ఇలాంటి ఉద్దేశ్యంతోనే ఈ "శ్రీనివాస బాలభారతి" అనే పుస్తకమాలను చిన్న పిల్లలకో ప్రకటిస్తున్నది. దీన్ని 'బాలభారతి' అని పిలిచినా పెద్దవాళ్లక

ఎంతో విజ్ఞానాన్నందిస్తూ ఇది ప్రతికుటుంబాన్నీ ఆకర్షిస్తున్నది. చక్కని ఆదర్శం కలిగి, చరిత్ర ప్రసిద్ధి పొందిన మహాపురుషుల, మహాపతివ్రతల కథలు ఇందులో చిన్న చిన్న వాక్యాల్లో చెప్పడం జరుగుతుంది. ఈ బాలసాహిత్యాన్ని చిన్నారి పాపలు బాగా చదివి ఉపయోగించుకుంటారని ఆశిస్తున్నాను.

ఈ బాల సాహిత్యప్రణాళికను చక్కగా రూపొందించి, మంచి రచనలను తయారు చేయించి, అందరికీ అందుబాటులో ఉండేటట్లు సంపాదించిన డాక్టర్ ఎస్.బి. రఘునాథాచార్య గారికి నా అభినందనలు. ఈ ప్రణాళికలో ఎందఱో రచయితలకు, కళాకారులు సహకరిస్తున్నారు; వారందరికి నా ధన్యవాదాలు. ఈ పుస్తక ప్రతులు చెల్లిపోయినందున పునర్ముద్రిస్తున్నాం. ఆసక్తిగల బాలలతోపాటు అందరినీ అలరిస్తుందని మా ఆకాంక్ష.

కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# స్వాగతం!!

శ్రీవివాదదయోద్భూతా బాలానాం స్ఫూర్తిదాయినీ।
భారతీ జయతాల్లోకే భారతీయగుణోజ్జ్వలా ॥

ఖండ ఖండాంతరాల్లో నాగరికత కన్ను విప్పేనాటికే సభ్యతకు సంస్కారానికి, నైతిక–ధార్మికాదర్శాలకు పేరు పడ్డది మన భరతఖండం. ఈ గడ్డపై పుట్టిన ప్రతిమానవుడు అధర్మాన్ని ఎదిరిస్తూ, ధర్మాచరణంలో తన జీవితాన్ని పండించుకొని, మాధవాభిముఖంగా నడచి మహనీయకీర్తి నార్జించినవాడే. అలాంటి మహాత్ముల సన్నిధి మన సుఖసంతోషాలకు పెన్నిధి. కనీసం వారి జీవితాదర్శాలు మనస్సుల్లో మెదిలితే వాటి ప్రభావం మనమీద ఎంతో ఉంటుంది. 'నేను భారతీయుణ్ణి' 'ఇది తరతరాలనుంచి వస్తున్న నా సంప్రదాయం' 'ఇది నా కర్తవ్యం' అని ప్రతిబాలుడు బాలిక ఈ దేశ సేవకు తనను అంకితం చేసుకొంటారు.

ఏనాటికి ఈ దేశంలో ఎందరో మహామునులు మహాపురుషులు, మహాపతివ్రతలు, మహావీరులు పుట్టి, పెరిగి, దక్కని

సంస్కృతికి పునాదులు వేశారు. స్వచ్ఛమైన జీవనవాహినిని మన దాకా ప్రవహింపచేశారు. అహా! మనమెంత అదృష్టవంతులం! మనవెనుక ఎంత ఉదాత్తమైన చరిత్ర ఉంది. ఆ పుణ్యపురుషులు మహాసాధ్వులు ఇక్కడ పుట్టకపోతే మనదిగా మనం చెప్పుకొనే మహత్తరమైన ఈ సంస్కృతి, సభ్యత మనకెలా సంక్రమించేవి! వాళ్లను అర్థంచేసుకోవడం, వాళ్ల చరిత్ర మననంచేసుకోవడం వారి ఆదర్శాలు స్మరించడంకూడ మనకు గొప్ప విజ్ఞానాన్నందించే విద్యాభ్యాసం. అది ముందు ముందు మనజాతి జీవనప్రవాహంలో కొన్ని ఏండ్లదాకా చెక్కుచెదరని స్ఫూర్తిసౌరభాలను విరజిమ్ముతుంది. అందుకే శ్రీనివాసబాలభారతి ఉదయించింది. ఎందరో మహానుభావుల్ని మీ ముందుంచుతోంది. ఇక మీదే ఆలస్యం.

బాలలూ! రండి! రండి!

నిండుమనస్సుతో మీ కిదే మా స్వాగతం!

శ్రావణపూర్ణిమ
23-8-1988

ఎస్. బి. రఘునాథాచార్య
ప్రధానసంపాదకుడు

దారిద్ర్యమూ దుర్భరంగా ఉంది. అపరే చిన్ననాటి స్నేహితుడు: రమ్మని ఎప్పుడో ఆహ్వానించారు కూడా. అవస్థల్లో ఆమాత్రం ఆదుకోకపోతాడా!' అని అతడు రాజదర్శనానికి వెళ్లారు. ఆరాజు బాల్య స్నేహాన్ని లెక్క చెయ్యకుండా 'నావంటి మహారాజుకు నీలాంటి పేదవాడితోనా స్నేహం? ఛీ! ఛీ! వెళ్లిపో!' అని రాజ్యమదాంధకారంతో కన్నుమిన్ను గానక కసరికొట్టారు. అవమానాన్ని కొన్నాళ్లు దిగమింగుకొని అతడు తనంతవారైన తన శిష్యుల్ని ఆరాజుపై ప్రయోగించారు. అఖండులైన శిష్యులారాజును పెడరెక్కలు విరిచి రథానికి కట్టి తెచ్చి ఆచార్యుని పాదాలపై పడేసి గురుదక్షిణను సమర్పించుకొన్నారు.

ఆయనెవరో తెలుసా?

ధనుర్విద్యలో అందెవేసిన చేయి, పరశురాముని ప్రియశిష్యుడు, కౌరవపాండవులకు సకలాస్త్రవిద్యలనుపదేశించిన గురువు, ద్రోణాచార్యులు. ద్రుపదుణ్ణి ఆచార్యుని పాదాలపై పడేసి గురుదక్షిణ సమర్పించుకొన్న ప్రియశిష్యుడు అర్జునుడు.

మహాభారతయుద్ధంలో భీష్ముని తరువాత సర్వసేనాధిపత్యాన్ని నిర్వహించి ఎన్నో వ్యూహాలను పన్ని పాండవసైన్యాన్ని గడగడలాడించిన గండరగండడీ ద్రోణాచార్యుడు.

గురువుకు తగిన శిష్యుడై, తనకు తగ్గవి శిష్యులను తయారుచేసి, ఉత్తముడైన ఆచార్యుడై, తన గురువులాగానే "ఇదం బ్రాహ్మమిదం క్షాత్రమ్" అని పట్టుదలకు శౌర్యధైర్యపరాక్రమాలకు ఆదర్శంగా నిలచిన ద్రోణాచార్యులకథ మన కెంతో స్ఫూర్తినిస్తున్నది. చదువుకుందామా మరి.

— ప్రధానసంపాదకుడు.

# ద్రోణాచార్యులు

కురువృద్ధులలో పేరెన్నికగాంచిన వారిలో ద్రోణాచార్యులొకరు. ఇతని తండ్రి భరద్వాజముని. ఈ భరద్వాజునిచేత ఇతడు ద్రోణం(బాల్చి) లో పెంచబడటం చేత ఇతనికి ద్రోణుడని పేరు వచ్చింది.

ద్రోణ-ద్రుపదుల విద్యాభ్యాసం:

పుణ్యమూర్తి అయిన భరద్వాజమునికి వృషతుడు అనే స్నేహితుడున్నాడు. ఇతడు పాంచాలదేశానికి రాజు. ఒకప్పుడు తపస్సుచేస్తూ ఇతడు సమీపంలో పూలుకోస్తున్న మేనకను చూశాడు. వెంటనే రేతఃస్ఖలనం అయింది. దాంట్లోనుండి ఒక బాలుడు పుట్టాడు. అతడే ద్రుపదుడు. ఇతడికి యజ్ఞసేనుడని కూడ పేరు. వృషతుడు ఆ కొడుకును ఇంటికి తీసికొనివెళ్ళకుండా స్నేహితుడైన భరద్వాజమహామునికే అప్పుచెప్పి విద్యాభ్యాసం చేయించాడు. భరద్వాజుడు తన కొడుకైన ద్రోణునికి, స్నేహితుని కుమారుడైన ద్రుపదునికి వేదాలు విలువిద్య బాగా నేర్పించాడు. కొన్నాళ్లకు వృషతుడు చని

పోయినందువల్ల ద్రుపదుడు పాంచాలదేశానికి రాజుగా అభిషిక్తుడయ్యాడు. పాంచాలదేశానికి వెడుతూ స్నేహితుడు సహపాఠి అయిన ద్రోణుని తనదేశానికి రావలసిందిగా పదే పదే చెప్పాడు.

**అశ్వత్థామ పుట్టాడు:**

ద్రుపదుడు వెళ్లిపోయిన తరువాత ద్రోణుడు అగ్నివేశుడనే మహాముని దగ్గర ధనుర్విద్యను అభ్యసించాడు. అతని కృపవల్ల ఆగ్నేయాస్త్రం మొదలైన దివ్యాస్త్రాలను సంపాదించాడు. అతనిచదువు కొంతపూర్తి అయింది. అందువల్ల తండ్రి అతనిని వివాహం చేసుకోమని చెప్పాడు. తండ్రిఆదేశం ప్రకారం ద్రోణుడు కృపాచార్యుల చెల్లెలైన కృపిని పెళ్లిచేసికొన్నాడు. అతనికి అశ్వత్థామ అనే కుమారుడు జన్మించాడు.

**ఈ రెంటిలో ఏం కావాలి:**

ద్రోణుడు దరిద్రుడు. అందుచేత కుటుంబపోషణ కోసం ధనాన్ని సంపాదించాలని అనుకున్నాడు. జమదగ్ని కుమారుడైన పరశురాముడు బ్రాహ్మణులకు ఎడతెగకుండ ధనాన్ని దానం చేస్తున్నాడని విన్నాడు. వెంటనే మహేంద్ర

పర్వతంపైన తపస్సు చేసుకొంటున్న పరశురాముడి దగ్గరకు వెళ్ళాడు. సచ్చరిత్రుడైన పరశురాముడు ద్రోణుని చూసి వచ్చిన పని ఏమిటని అడిగాడు. దానికి జవాబుగా ద్రోణుడు తన బీదరికాన్ని చెప్పుకొని ధనాభిలాష విన్నవించు కున్నాడు. ఇతనికోరిక విన్న పరశురాముడు కొంచెం ఖిన్నుడై అంతకు ముందే తన దగ్గరనున్న ధనాన్నంతా బ్రాహ్మణులకు, మిగిలిన ఈభూమినంతా కశ్యపమహామునికి దానం చేశానని చెప్పాడు. కాని ఇంకా తన శరీరం, ధనుర్విద్య మిగిలి ఉన్నాయి కాబట్టి ఈ రెంటిలో ద్రోణునికి కావలసింది ఏదో కోరుకోమన్నాడు. అప్పుడు ద్రోణుడు కొంచెం ఆలోచించి తనకు ధనుర్విద్య ప్రసాదించమన్నాడు. ధనుర్విద్యలో అద్వితీయుడైన పరశురాముడు తనవిద్యను పూర్తిగా ద్రోణు నికి చెప్పాడు. ద్రోణుడు పరశురాముని దగ్గర ఎన్నో దివ్యా స్త్రాలు, వాటిని ప్రయోగించటంలో గల రహస్యాలు, వాటికి సంబంధించిన మంత్రాలు, వాటి ప్రయోగోపసంహారాలు మొదలైనవి సంపూర్ణంగా నేర్చుకొని విద్యాభ్యాసం పూర్తి చేశాడు.

అహం దెబ్బతిన్నది:

పరశురాముని దగ్గర సకలాస్త్రవిద్యలు నేర్చుకొన్న తరువాత ద్రోణుడు తన బాల్యమిత్రుడైన ద్రుపదుని దగ్గరికి ధనం కోసం వెళ్లాడు. ద్రుపదుడు పాంచాలదేశానికి రాజుగా సకలైశ్వర్యాలతో తులతూగుతున్నాడు. ద్రోణుడేమో దారిద్ర్యంలో పరాకాష్ఠననుభవిస్తున్నాడు. ద్రోణుడు ద్రుపదుని దర్శించి తమ బాల్యస్నేహాన్ని జ్ఞాపకం చేశాడు. కాని ద్రుపదుడు ఈవిషయాన్ని పట్టించుకోకుండా, తను మహారాజునని, తనవంటి రాజులకు ద్రోణునివంటి బీదబ్రాహ్మణులతో సఖ్యం అసంభవమని చెప్పి ద్రోణుని వెళ్లిపొమ్మన్నాడు. ద్రోణునికి కోపం వచ్చింది. చేసేది ఏమిలేక బరువైన హృదయంతో, తనకుజరిగిన అవమానాన్ని తల్చుకుంటూ కలతపడ్డ మనస్సుతో భార్యాపుత్రులతో హస్తినాపురానికి బయలుదేరాడు.

బంతి నూతిలో పడింది:

హస్తినాపురానికి వెలుపల పెద్ద మైదానం ఉంది. ఆ మైదానంలో సాధారణంగా కురువంశానికి సంబంధించిన రాజ కుమారులందరు ఆడుకుంటారు. ఆ విధంగానే ఆనాడు కూడ

కౌరవులు పాండవులు బంతితో ఆడుకుంటున్నారు. ఆటమధ్యలో బంగారు రంగులో ఉన్న ఆ బంతి అక్కడికి దగ్గరగా ఉన్న నూతిలో పడింది. ఈ రాజకుమారుల దగ్గర ఆ బంతిని పైకి తీయటానికి మామూలు పరికరాలు లేవు. దాన్ని పైకి తీసే ఉపాయం ఏమి తోచక అందరు బిక్క మొహాలతో ఆ నూతిలోకి చూస్తూ ఆలోచిస్తున్నారు.

నేను తీసి ఇస్తాను:

ఆ సమయంలో ద్రుపదునివల్ల అవమానంతో కృంగి పోతున్న ద్రోణుడు ఆ ప్రదేశానికి చేరుకున్నాడు. రాజ కుమారుల్ని చూసి వీళ్లతో మాట్లాడుతూ జరిగిన సంగతి తెలిసికొన్నాడు. గౌతముని దగ్గర శస్త్రాస్త్రవిద్యలు నేర్చు కొన్న భరతవంశజులకు ఈ చిన్న బంతిని పైకి తీసే ఉపాయం తోచకపోవటం ఆశ్చర్యంగా ఉన్నదంటూ దానిని తను తీసి యిస్తానన్నాడు. వారంతా పెల్లుబికిన కుతూహలంతో చూస్తూ ఉండగా ద్రోణుడు మొదట బాణంతో ఆ బంతిని గుచ్చాడు. తరువాత బాణంపై బాణంవేసి పైదాకా బాణాలను తెచ్చి బంతిని పైకితీసి రాకుమారులకిచ్చాడు. ఈ బుద్ధి

చాతుర్యాన్ని విలువిద్యలో నేర్పును గమనిస్తున్న రాకుమారుల ఆశ్చర్యానికి మేరలేదు. వాళ్ళు వెంటనే ద్రోణుని తీసికెళ్ళి తాతగారైన భీష్మాచార్యులకుచూపి జరిగినవిషయం అంతా ఎంతో సంతోషంతో చెప్పారు.

ఏమి చేయదలచారు?

భీష్ముడు చాలకాలాన్నుంచి తన మనుమలకు ఉన్నత విద్యను నేర్పటానికి తగిన గురువు కోసం ఆలోచిస్తున్నారు. ద్రోణుడు తేజస్వి, అపరిమితమైన బలంకలవాడు. నల్లగా సన్నగా ఉన్నాడు. మంచిగుణాలతో ప్రకాశిస్తున్నారు. ఇలాంటి ద్రోణుని తన ఎదుట చూస్తూ అతని శరసామర్థ్యం మనుమలనుంచి విన్న భీష్మునికి అపరిమితమైన ఆనందం కలిగింది. వెంటనే గౌరవించి, స్వామీ! మీరు ఎక్కడ నుంచి వస్తున్నారు? ఎక్కడ ఉండాలనుకొన్నారు? అని అడిగాడు భీష్ముడు.

వెతకబోయిన తీగ:

ఆ మాటలకు ద్రోణుడు "ఆచార్యా! నా తండ్రి భరద్వాజుడు. అగ్నివేశమహాముని ఆశ్రమంలో బ్రహ్మచర్య

నిష్ఠతో వేదాధ్యయనం చేసి, ధనుర్వేదాన్ని అభ్యసించాము. ఆ కాలంలోని పాంచాలరాజైన వృషతుని కుమారుడు ద్రుపదుడు నాకు సహపాఠి. గౌతమి అయిన కృపిని తండ్రి కోరిక ప్రకారం వివాహంచేసుకొన్నాను. మహాతేజస్వి అశ్వత్థామ అనే వీడు నా కుమారుడు. నేను దరిద్రుణ్ణి అయినప్పటికీ రాజుల దగ్గరికిపోయి దానం తీసికోవటం ఇష్టం లేకుండా కాలం గడుపుతున్నాను. కానీ నా కుమారుడు చిన్న వాడు కావటంతో, రాకుమారులు అందరు పాలు త్రాగటం చూసి తనకు కూడా పాలు కావాలని ఏడ్చాడు. అప్పుడు నేను నా బాల్యస్నేహితుడైన ద్రుపదుణ్ణి తలచుకొని, గురుకులాన్నుంచి అతను రాజ్యాధికారాన్ని స్వీకరించటానికి వెడుతూ తన దగ్గరికి రావలసిందిగా చెప్పిన విషయం జ్ఞాపకం చేసుకొని నా దారిద్ర్యాన్ని తీరుస్తాడనే ఆశతో అతని దగ్గరికి వెళ్ళాను. కాని ద్రుపదుడు రాజ్యమదంతో ఈసడింపుగా మాట్లాడి, బీదవాడవైన నీకు సకలభోగాలతో తులతూగు తుండే రాజులకు స్నేహం అసంభవమని చెప్పి వెళ్ళి పొమ్మన్నాడు. ఆ అవమానం భరించలేక, చేసే పని లేక

విధంగా ఈ రాజ్యానికి వచ్చాము" అని తన చరిత్రము

సంపూర్ణంగా వివ్రవించాడు. ఈ ఉదంతాన్ని విన్న భీష్మునికి ఎంతో సంతోషం కలిగింది. వెతకబోయిన తీగె కాళ్ళకు తగిలినట్లుగా అతడు భావించాడు. వెంటనే దృఢ బాహుడైన ద్రోణుని తగిన విధంగా పూజించి ధనాదుల్ని దానం చేసి అపరిమిత సంతోషభరితుణ్ణి చేశాడు.

తరువాత భీష్ముడు పాండవకౌరవ రాకుమారుల నందర్ని ద్రోణునికి అప్పగించి, వాళ్ళందరికి విలువిద్యలన్నీ నేర్పవలసిందిగా కోరాడు. అందుకు ద్రోణుడు అంగీకరించి కౌరవులకు పాండవులకు విలువిద్యను నేర్పాడు. అప్పటి నుంచి ద్రోణుడు ద్రోణాచార్యులుగా పిలవబడ్డాడు.

నా కోరిక తీర్చగల వారెవరు?

అస్త్ర విద్యాభ్యాసం పూర్తి అయిన తరువాత ఒక రోజు ద్రోణాచార్యులు రాకుమారులనందర్ని చూచి మీలో నా కోరిక తీర్చగలవారెవరని ప్రశ్నించాడు. ధృతరాష్ట్ర నందనులు ఒకరి మొగం ఒకరు చూసుకొని ఏమీ పలుక లేదు. అప్పుడు పాండునందనుడైన అర్జునుడు తాను గురువు గారి కోర్కె తీర్చగలనని జవాబు చెప్పాడు. అందుకు

గురువు చాల సంతోషించి అతణ్ణి ప్రీతితో కౌగలించుకొని విలు విద్య నేర్పడం ప్రారంభించాడు. కేవలం కౌరవులే గాక తక్కిన రాకుమారులు గూడా వచ్చి ఆయన దగ్గఱ విలువిద్యను అభ్యసిస్తూ ఉండేవారు. అప్పటినుంచి సూతపుత్రుడైన రాధేయుడు అర్జునుని అస్త్రవిద్యాకౌశలానికి అసూయ పడుతూ దుర్యోధనునిపై పక్షపాతాన్ని పెంచుకొన్నాడు.

పాటిలేని విలుకాడు:

ఎడతెరిపి లేని అస్త్రశస్త్ర విద్యాభ్యాసంలో అర్జునుడు నేర్పరి అయినాడు. విద్యాకౌశలంతో పాటు గురు భక్తితో ద్రోణాచార్యుల్ని మెప్పించాడు. అర్జునుని తెలివి తేటలను గ్రహించిన ద్రోణునికి, అతనిపై వాత్సల్యం పెరి గింది. ఈ విషయాన్నంతా గ్రహించిన అశ్వత్థామకు అర్జునుడిపై అసూయ కలిగింది. అర్జునునికి చీకట్లో భోజనం ఎప్పుడూ పెట్టవద్దని అతడు వంటవాడిని అజ్ఞాపించాడు. కాని ఒకప్పుడు అర్జునుడు భోజనం చేస్తుండగా పెనుగాలి వీచి దీపం ఆరిపోయింది. ఆ చీకటిని లెక్కచేయక అర్జునుడు భోజనం చేస్తూ ఆలోచించాడు. 'అభ్యాసవశంవల్ల కదా

చీకట్లో కూడా భోజనం చేయటానికి వీలయింది. కనుక ఏ పని అయినా అభ్యాసంతో ఎప్పుడయినా చేయవచ్చు' నని అందువల్ల అర్జునుడు అర్ధరాత్రి గూడ ధనుర్విద్యాభ్యాసం మొదలు పెట్టాడు. ఒకనాటి రాత్రి అల్లెత్రాటి శబ్దం విన్న ఆచార్యుడు నిద్ర మేల్కొని ఇతని దగ్గరికి వచ్చి చూసి అతని విద్యాసక్తికి మెచ్చి ధనుర్ధరులందరిలో సాటిలేని వాడ్జిగా చేస్తానని వాగ్దానం చేశాడు. అది మొదలు అతనికి ద్వంద్వ యుద్ధం, సంకీర్ణయుద్ధం, రథయుద్ధం, భూమిపై యుద్ధం, అశ్వయుద్ధం, వారణయుద్ధం అనే చతురంగబలాలతో కూడిన యుద్ధప్రక్రియ అనేక విధాలైన వ్యూహాదులు వాటి ఛేదనోపాయాలు అస్త్రప్రయోగరహస్యాలు మొదలైన మెలుకువలన్నిటిని ఒంటిగా నేర్పాడు.

గురువుకు బదులు అతని బొమ్మ:

ఈ విధంగా అనేకరకాలైన గదాదిఆయుధాల్లో కురు కుమారులకందరికి శిక్షణయిస్తున్న ద్రోణాచార్యుల కీర్తి నలుదిశల వ్యాపించింది. ఆచార్యుని కీర్తిప్రతిష్ఠలు విని హిరణ్యధన్వుడనే ఎఱుకలరాజు కొడుకు ద్రోణుని దగ్గరకు

వచ్చి తనని ధనుర్విద్యలో శిష్యుడిగా చేపికోమని ప్రార్థించాడు. కాని ఆచార్యులు అతడు నిషాదుడనే కారణంతో శిష్యుడుగా అంగీకరించలేదు. అప్పుడు ఏకలవ్యుడు ఆచార్యుల సమ్మతిపై తన యింటిదగ్గరనే అతని విగ్రహాన్ని మట్టితో చేసి ప్రతిదివం దాన్ని భక్తితో పూజిస్తూ ఎడతెగని అభ్యాసంతో ధనుర్విద్యారహస్యాల్ని గ్రహించాడు.

ఇంతటి వ్యక్తి ఎవరు?

ఇక్కడ హస్తినాపురంలో రాకుమారుల విద్యాభ్యాసం నిరాటంకంగా జరుగుతోంది. ఒకనాడు రాకుమారులందరు వేటాడాలనే కోరికతో అరణ్యానికి వెళ్ళారు. అక్కడ వీరి భటునికి సంబంధించిన కుక్క దోవతప్పి వంటరిగా అభ్యాసం చేసుకుంటున్న ఏకలవ్యుని సమీపంలోకి వచ్చి అతనినిచూసి మొఱిగింది. అప్పుడు ఏకలవ్యుడు దాని నోట్లో ఒక్కసారిగా ఏడు బాణాలు వేశాడు. ఆ కుక్క పరుగుపరుగున రాకుమారుల దగ్గరకు వచ్చింది. దాన్ని చూసిన కురుకుమారులు ఆశ్చర్యచకితులై ఇంతటి వ్యక్తి ఎవరా? అని చూడటానికి బయలుదేరారు. వాళ్ళు త్రోవలోదృఢమైన నల్లని శరీరంతో

జింకతోలు కట్టుకుని, ప్రకాశిస్తున్న బాణసమూహంతో ఉన్న ఏకలవ్యుని చూసి అతనెవరో తెలుసుకోవాలని ప్రశ్నించారు. అప్పుడు ఏకలవ్యుడు తను హిరణ్యధన్వుడనే వనచరుని కుమారుణ్ణని, ద్రోణాచార్యుల శిష్యుణ్ణని సమాధానం చెప్పాడు. కురుకుమారులు తిరిగి వచ్చి ఈ సంగతిని ద్రోణాచార్యులకు విన్నవించారు.

ఏకలవ్యుని గురుదక్షిణ:

ఈ సంఘటన జరిగినప్పటినుంచి మనస్సులో కొంత ఆందోళన పడుతున్న అర్జునుడు ఒకనాడు ఆచార్యునితో ఏకలవ్యుని అసమాన అస్త్రవిద్యాకౌశలాన్ని గురించి ప్రసంగించి తన విషయంలో ఆయన చేసిన ప్రతిజ్ఞను జ్ఞాపకం చేశాడు. అది విన్న ద్రోణుడు అర్జునుడు వెంటరాగా అడవికి వెళ్ళి, ఏకలవ్యుని చూశాడు. అప్పుడు ఏకలవ్యుడు ఆచార్యుల రాకకు ఎంతో సంతోషించి తన శరీరసర్వస్వాన్ని వారికి నివేదించి, తను ఏవిధంగా ఆచార్యులను పూజిస్తూ పరోక్షంగా విలువిద్యను నేర్చుకున్నది విన్నవించాడు. అది విన్న ఆచార్యులు తమకు గురుదక్షిణ ఇవ్వాల్సిందని కోరారు. వెంటనే ఏక

లవ్యుడు తన శరీరం, తన ధనం, తన పరిజనం, యీ మూడింటిలో ఆచార్యులకు ఏవి ఇష్టమో కోరుకోమన్నాడు. ద్రోణుడు కొంచెం ఆలోచించి ఏకలవ్యుణ్ణి అతని కుడిచేతి బొటనవ్రేలు మాత్రం తమకు గురుదక్షిణగా కోరగా ఏక లవ్యుడు సందేహించకుండా బొటనవ్రేలిని కోసి ఇచ్చాడు. దాన్ని గ్రహించిన ద్రోణుడు అర్జునునితో హస్తినాపురాన్ని చేరుకున్నాడు. దీనితో ఏకలవ్యుడి ధనుర్విద్యాభ్యాసం ముగి సింది. అర్జునుడి మనస్సులోని వ్యథ మాయమయ్యింది.

ఇంకేమీ కనబడటం లేదు:

శస్త్రాస్త్రవిద్యలను నేర్పుతున్న కుంభసంభవుడు ఒకనాడు రాకుమారుల పాండిత్యాన్ని పరీక్షించాలని అనుకు న్నాడు. అందుకు గాను ఒక చెట్టుకొమ్మపైన బంగారు వన్నె గల కృత్రిమమైన పక్షిని ఉంచి రాకుమారులనందరిని పిలిచి, తన అభిప్రాయాన్ని చెబుతూ వంటరిగా ఒక్కొక్కరిని పరీక్షిస్తానని అన్నాడు. అందుకు వారందరు అంగీకరించారు. అప్పుడు ద్రోణుడు ప్రథమంగా ధర్మరాజుని పిలిచి రాజా! ఆ వృక్షశాఖాగ్రాన ఉన్న పక్షిని చూశావా? అని అడిగాడు.

చూశాను అని ధర్మరాజు చెప్పాడు. వెనువెంటనే నన్ను మీ తమ్ముళ్ళి అందరినీ చూశావా అన్నాడు. ధర్మజుడు ఈ ప్రశ్నకు కూడా'చూశాను' అని జవాబు చెప్పాడు. ఆచార్యుడు వెంటనే నీ చూపు చెదిరి పోయింది. నీకు ఏకాగ్రత లేదు కనుక నీవు ఆ పక్షిని కొట్టలేవు అని చెప్పి ధర్మజుని పంపివేశాడు. ఈ విధంగానే తక్కిన దుర్యోధనాదులైన కురునందనుల్ని, భీమాదులైన పాండవుల్ని వివిధదేశాల నుంచి వచ్చిన ఇతర రాకుమారుల్ని అడిగి వారికి ఏకాగ్రత లేదనే విషయాన్ని నిరూపించి పంపివేశాడు. చివరకు అర్జునుణ్ణి పిలిచి యీ విధంగానే అతనిని గూడ ప్రశ్నించాడు. అందుకు అర్జునుడు నరక వలసిన ఆ పక్షిశిరస్సు తప్ప తనకు మరేమీ కనపడటం లేదని జవాబు చెప్పాడు. గురువు ఎంతో సంతోషించి అర్జునుణ్ణి ఆ పక్షిశిరస్సును కొట్టమన్నాడు. వెంటనే అర్జునుడి బాణంతో ఆ కృత్రిమ పక్షిశిరస్సు క్రిందపడింది. అర్జునుని కౌశలానికి ద్రోణాచార్యులు చాలా సంతోషించి అతనికి అనేకమైన అస్త్రాలను ప్రసాదించాడు.

ఇతడే తగినవాడు:

ఈ సంఘటన తరువాత ఒకనాడు ద్రోణుడు రాకుమారుల నందర్నీ తీసుకొని గంగానదికి స్నానానికి వెళ్ళాడు. అక్కడ నీళ్ళలో ఏదీకనిష్ఠతో ధ్యానంలోనున్న ద్రోణుని తొడను ఒక పెద్ద మొసలిపట్టుకుంది. ఇది పైకి స్పష్టంగా కనపడటం లేదు. ద్రోణుడు దానిని విడిపించుకోవటానికి సమర్థుడైనప్పటికి, శిష్యులను ఆ మహాగ్రాహాన్ని చంపమన్నాడు. అది స్పష్టంగా కనబడనికారణంవల్ల దుర్యోధనాదులందరు తమ అశక్తతను వెల్లడించారు. చివరకు అర్జునుడు మాత్రం అందుకు అంగీక రించి ఐదు బాణాలు వేసి ఆ మొసల్ని చంపి ఆచార్యుల్ని రక్షించాడు. ఈ సంఘటనతో ద్రోణునికి అమితమైన ఆనందం కలిగి ద్రుపదునిపై తనకు గల కసి తీర్చుకోవటానికి అర్జునుడే తగిన సాధనం అని నిశ్చయించాడు.

కుమారుల విద్యాప్రదర్శనం:

కొంతకాలం తరువాత రాకుమారుల అస్త్రవిద్యా కౌశల ప్రదర్శనం ఏర్పాటు చేయబడింది. దీన్ని చూడటానికి అనేక నగరాలనుంచి ప్రజలు తండోపతండాలుగా వచ్చారు.

ఆస్థానంలోని వారంతా తమ తమ ఆసనాలను అలంక రించారు. అప్పుడు రంగ మధ్యంలో నిల్చున్న రాకుమారు లందరు ఆచార్యుని అనుజ్ఞతో తమ తమ విద్యల్లో తాము గడించిన కౌశలాన్ని చూపుతున్నారు. ఆ సమయంలో భీమదుర్యోధనులిద్దరు తమ గదాయుద్ధ నైపుణ్యాన్ని ప్రద ర్శించటానికి సంసిద్ధులయ్యారు. ఈప్రదర్శనలో వారిద్దరిలో ఒకళ్ళపై ఇంకొకళ్ళకు గల క్రోధం ఎక్కువై ద్వేషాగ్ని ప్రజ్వరిల్లింది. దీన్ని చూపిన ద్రోణుడు తన కుమారుడైన అశ్వత్థామను పంపి వారిరువురి ప్రదర్శనాన్ని ఆపి అర్జునుని అస్త్రవిద్యాకౌశల ప్రదర్శనానికి అనుమతించాడు.

అర్జునునిపై కర్ణుని సవాలు:

వరుడు ఆచార్యుని అనుమతితో తాను నేర్చుకొన్న అనేక విధాలైన అస్త్రవిద్యారహస్యాల్ని ప్రదర్శించాడు. ఆ సమయంలో రంగమధ్యంలోకి కర్ణుడు ప్రవేశించి తనకు గూడ ఈవిద్యలన్నీ తెలుసునని చెప్పి ద్రోణుని అనుజ్ఞతో వాటిని ప్రదర్శించి ఈర్ష్యాకులుడై అర్జునుని సవాలు వేశాడు. పార్థుడు ఆచార్యుని అనుమతితో కర్ణునితో ద్వంద్వయుద్ధానికి

ఉపక్రమించాడు. ఆ యుద్ధం అతిభీకరంగా జరగటంతో కృపాచార్యులు వారి నడుమకు వచ్చి అపములమధ్య యుద్ధం శాస్త్రవిరుద్ధం. అర్జునుడు రాకుమారుడు కనుక నీ అభిజాత్యాన్ని చెప్పమని అడిగాడు. అందుకు కర్ణుడు సిగ్గుతో తలవంచుకున్నాడు. ఈ సంఘటనను పూర్తిగా అవగాహన చేసికొన్న దుర్యోధనుడు వెంటనే కర్ణుని అంగరాజ్యానికి రాజుగా అభిషేకంచేశాడు.

ద్రుపదుని పట్టి తీసుకురండి:

అస్త్రవిద్యాప్రదర్శనానంతరం ఒకనాటి ప్రొద్దున సమయోచితకృత్యాలు తీర్చిన తరువాత ద్రోణుడు తన శిష్యులందర్ని పిలిచి తనకు గురుదక్షిణ నివ్వవలసిందిగా కోరాడు. అందుకు రాకుమారులందరు వారికి నమస్కరించి 'మీ అభీష్టాన్ని చెప్పవలసిందని' అడిగారు. అందుకు సమాధానంగా ద్రోణుడు 'ఐశ్వర్యమదోన్మత్తుడైన ద్రుపదుణ్ణి పట్టి తీసుకురండి. నాకిది అభీష్టమైన గురుదక్షిణ' అని చెప్పాడు. అందుకు రాకుమారులందరు అంగీకరించి, అమితోత్సాహంతో పాంచాలదేశంపై యుద్ధానికి బయలుదేరారు. కౌరవ

లందరు ముందు వయనమై తమ తమ రథాలమీద ద్రుపద రాజోన్ముఖులయ్యారు. వారి వెనుక ద్రోణునితో కూడి పాండవులు వయనం సాగించారు. దారిలో అర్జునుడు ఆచార్యునితో "స్వామీ! కౌరవులంతా అమితోత్సాహంతో ద్రుపదుని పట్టుకోటానికి ముందు బోయారు. ఇది కేవలం వారి గర్వసూచకం. ద్రుపదుడు వీరిచేత పట్టుబడేటంతటి దుర్బలుడు కాడని, మీ సహపాఠి అని పాపం వీరికి తెలియదు. కనుక వీరు అశక్తులై తిరిగి వచ్చిన తరువాత నేను రంగం లోకి దిగి మీ కోర్కె నెరవేరుస్తాను" అని చెప్పాడు. అందుకు గురువు అంగీకరించాడు.

మేమెవరమో గుర్తొచ్చిందా!

అనుకున్న ప్రకారంగా కౌరవులు పాంచాలదేశాన్ని ముట్టడించి యుద్ధాన్ని ప్రారంభించారు. శక్తికొద్దీ ఘోర మైన యుద్ధం జరిగింది. అందులో ద్రుపదుని శస్త్రాస్త్రాలకు తట్టుకోలేక కౌరవులు పారిబోయి వెనక్కు వచ్చారు. దీన్నంతా పరికిస్తున్న అర్జునుడు ద్రోణ, ధర్మజుల అనుమతితో భీమ, నకుల, సహదేవులు వెంటరాగా సంరంభంతో ద్రుపదుని

సైన్యంలోకి చొచ్చుకున్నాడు. ఇద్దరికి ఘోరమైన యుద్ధం జరిగింది. వీరి బాణసంతతితో రణరంగమంతా చీకట్లు కమ్మాయి. అర్జునుడు ద్రుపదుడు పరస్పరం ద్వంద్వయుద్ధం లోకి దిగారు. ఈ యుద్ధంలో అర్జునుని ధనుస్సు భగ్నం అయ్యేటట్లుగా పాంచాలుడు శరప్రయోగం చేశాడు. అప్పుడు పార్థుడు విజృంభించి కత్తి పట్టుకొని ద్రుపదుని పైకి ఉరికి ద్రుపదుని పట్టుకొని తన రథానికి కట్టి ఆచార్యుల దగ్గరికి తెచ్చి అప్పగించాడు. అప్పుడు ద్రోణుడు చాలా సంతో షించి ద్రుపదునితో "ఎవరయ్యా! మీరు .... ఆహా! ద్రుపదమహారాజులా! ఈవిధంగా బేల పోయినారేమి! ఇప్పటి కైనా రాజ్యాధికారగర్వం మదినుంచి తొలిగిందా! మే మెవరిమో గుర్తొచ్చిందా!" అని ఎగతాళిగా మాట్లాడి అతడ్ని వదిలేశాడు.

విచిత్రమైన గురుదక్షిణ:

ద్రుపదునికి పాంచాలరాజ్యంలో సగభాగం మాత్రమే ఇచ్చి తక్కిన సగాన్ని తన స్వాధీనంలో పెట్టుకొని అహిచ్ఛత్రం నుంచి పాలించాడు. ఈవిధంగా అర్జునుడి ద్వారా తనకోర్కె నెరవేర్చుకొన్న ద్రోణుడు అర్జునుని యుద్ధకౌశలానికి,

శక్తిసామర్థ్యాలకు ఎంతో ఆనందించి ఒకవాడు అతనికి బ్రహ్మ శిరస్సనే దివ్యబాణాన్నుపదేశించి అతనితో పార్థా! ఈ అస్త్రాన్ని 'అగస్తి' అనే దివ్యముని పూర్వం అగ్నివేశుడనే మహామునికి ఇచ్చాడు. వారు నాకు ప్రసాదించారు. నీవు తేజోవంతుడవు కాబట్టి నేను నీకు ఇస్తున్నాను. దీనిని మానవుల మీద, అల్పతేజస్కులమీద ప్రయోగించకు. అంత అవసరమైతే నిన్ను బాధించే మానవులమీద మాత్రం ప్రయోగించు అని చెప్పి ఈ అస్త్రోపదేశానికి గాను, అర్జునుని దగ్గరి నుంచి గురుదక్షిణగా తనను ఎదిరించి యుద్ధం చేయనని వాగ్దానం చేయించుకొన్నాడు.

మా కంటే ఎక్కువ ప్రేమ ఉన్నదా?

ద్రౌపదిని వివాహం చేసుకొన్న తరువాత పాండవులు ద్రుపదుని దగ్గర సకలైశ్వర్యాలు అనుభవించటం దుర్యోధనాదులకు కష్టం కలిగించింది. వారు పాండవుల ఉన్నతిని యిప్పుడుగూడ సహించలేకపోయారు. అందుకని వారు యీ విషయం ధృతరాష్ట్రునితో చెప్పి ద్రుపదుణ్ణి, పాండవులను విడదీసే ఉపాయం ఆలోచిస్తున్నారు. ఆ సందర్భంలో

కర్ణుడు పాంచాలులను యుద్ధంలో పరాజితుల్ని చేస్తే అన్ని సమస్యలు తీరుతాయని సలహా యిచ్చాడు. ఇందుకు ధృత రాష్ట్రుడు ఒప్పుకోక వృద్ధులైన భీష్మాదులతో సంప్రదించ మన్నాడు. అప్పుడు దుర్యోధనుడు సభ ఏర్పాటు చేయగా ఆ సభలో భీష్ముడు దుర్యోధనుని ఆలోచన సరిఅయింది కాదని పాండవులతో సఖ్యంగా ఉండవలసిందిగా అతనికి హితబోధ చేశాడు. ఈ అవకాశాన్ని వినియోగించుకొని ద్రోణాచార్యులు గూడా రాజరాజుకు పాండవులతో స్నేహంగా ఉండటమే మంచిదని బోధించాడు. అప్పుడు కర్ణుడు శత్రువులతో స్నేహంగా వుండమనటం రాజనీతికి విరుద్ధమని చెబుతూ ద్రోణుని అధిక్షేపించి, పూర్వం వితంతువనే మగధ రాజు అతని మంత్రిచే ఏ విధంగా మోసగించబడి రాజ్యం పోగొట్టుకున్నదీ చెప్పి, ఈ మంత్రుల మాటలు పాటించ దగ్గవి కావని చెప్పాడు. అందుకు ద్రోణుడు కోపించి కర్ణుని మాటలకు అర్థం లేదు. తమకంటే కర్ణునికి దుర్యోధనునిపై ప్రేమాతిశయాలు లేవని విపులంగా చెప్పాడు. ఈ విధంగా వీరిద్దరికి వాగ్వాదం జరుగుతున్న సందర్భంలో వీరుభ యుల్ని వారించి విదురుడు ధృతరాష్ట్రునకు నీతివాక్యాలు ఉపదేశించాడు. అంతటితో పాండవుల్ని హస్తినాపురానికి తీసికొని రావటానికి ధృతరాష్ట్రుడు విదురుని ఆదేశించాడు.

దుర్యోధనుని నింద:

గోగ్రహణ ప్రేరితమైన యుద్ధసందర్భంలో గాండీవ జ్యాఘోష, శంఖనాదం విన్న ద్రోణాచార్యులు విరాట పక్షంలో వస్తున్నది అజేయుడైన అర్జునుడు కనుక అనవసర ప్రలాపాలు ఆపి, సైన్యాన్ని సరిగా అమర్చవలసిన అవసరం ఉంది అని చెబుతూ తమ పక్షంలో అనేకమైన అప శకునాలు కనబడుతున్నాయి, గెలవడం అనుమానంగా ఉంది అని చెప్పాడు. అందుకే దుర్యోధనునికి కోపం వచ్చి తనముందు అర్జునుడొక లెఖ్ఖగాడు. సైన్యాన్ని సరిగా అమర్చుకొంటే శత్రువులకు భయపడవలసిన అవసరం లేదు. అప్పుడు ధర్మరాజు కూడ తమని ఎదిరించలేడని చెబుతూ, ద్రోణాచార్యులు అర్జునుణ్ణి ఎదిరించటం కష్టమని తనఎదుట చెప్పటం హాస్యాస్పదం; ఈ విషయాన్ని విన్నవారు ఎవరైనా నవ్వుతారు అని చెప్పి, శత్రువుని పెద్దచేసి తమదగ్గర పొగడటం మంచిదికాదు. పొగడటం కేవలం వందిమాగధ వృత్తి. ఆచార్యులలోటివారు యుద్ధసమయంలో నీతి శాస్త్రం ప్రచారం చేయటం ఉచితంకాదు అని అధిక్షేపించాడు.

తన తండ్రిని పరుషవాక్యాలు పలికినందుకు అశ్వత్థామ రాజరాజుపై కోపించి అతని మూర్ఖత్వాన్ని నిందించాడు.

అర్జునుని నమస్కారబాణాలు:

సైన్యం సన్నద్ధమైంది. కురువీరులు సిద్ధంగా ఉన్నారు. రణరంగంలోకి ప్రవేశిస్తున్న అర్జునుణ్ణి చూసి అంతకు ముందు, వారు అనుభవించిన కష్టాలను తలచుకొని కొంచెం ఖిన్నుడైనప్పటికి, అతని తేజాన్ని పరికించి ఆనందించాడు ద్రోణుడు. అర్జునుడు పెద్దలపట్ల తన భక్తి గౌరవాల్ని వెలిబుచ్చాడు. ద్రోణాచార్యుల పాదాలముందు నిలిచేటట్లుగా రెండుబాణాలు వేశాడు. ఈ విధంగా తనకు నమస్కారం చేయటం కుశలప్రశ్నలను అడగటం గ్రహించిన ద్రోణాచార్యులు బాగా సంతోషించాడు. ఈ విషయాన్ని గమనిస్తున్న భీష్మ కృపులు సవ్యసాచి భక్తిశ్రద్ధలను మెచ్చుకొన్నారు.

ద్రోణార్జునయుద్ధం:

యుద్ధారంభానికి ముందు అర్జునుడు కురుసైన్యంలోని పెద్దలందరిని ఉత్తరునకు తెలియజేశాడు. అప్పుడు తను

ద్రోణాచార్యులతో యుద్ధం చేయననికూడ చెప్పాడు. కానీ రణరంగంలో ఆచార్యులతోటి యుద్ధం తప్పింది కాదు. వీరిరువురకు ఘోరమైన యుద్ధం జరిగింది. ఉభయులు అస్త్రవిద్యాకౌశలాన్ని ఆశ్చర్యం కలిగేటట్లుగా చూపించారు. ద్రోణాచార్యులు అర్జునుని ధనుర్విద్యాకౌశలాన్ని లోలోపల వేనోళ్ళ కొనియాడాడు. చివరకు అర్జునుడు, కుంభసంభవుని రథాన్ని అశ్వాల్ని కూల్చివేశాడు. అంతటితో వారి ఉభయుల మధ్య యుద్ధం ముగిసినా అశ్వత్థామతో యుద్ధం చేయటం అర్జునుడికి తప్పలేదు.

కురుపాండవయుద్ధం:

భారతయుద్ధానికి సన్నద్ధుడౌతూ దుర్యోధనుడు గాంగేయుని అనుమతితో ద్రోణాదుల్ని పదకొండుమందిని తన పదకొండు అక్షౌహిణులకు సేనాధిపతుల్నిగా నియమించాడు. భీష్ముణ్ణి సర్వసైన్యాధిపతిగా చేశాడు. ఈ సందర్భంలోనే భీష్ముడు కౌరవసేనలో గల నాయకుల శక్తి సామర్థ్యాలను పేర్కొంటూ. ద్రోణాచార్యులను అతిరథుడని పేర్కొన్నాడు. ఈతడు శత్రువులకు భయంకలిగించేవాడు.

ఇరువైపుల వారికి ఇతడు గురువు. ద్రోణునికి తెలియని వ్యూహాలు లేవు. అమోఘమైన దివ్యబాణాలు ఈతని వశంలో వుంటాయి.

భీష్ముని రెండవనాటి యుద్ధంలో ధృష్టద్యుమ్నుడు ద్రోణాచార్యులతో యుద్ధానికి పూనుకున్నాడు. వీరిరువురి మధ్య భయంకరమైన యుద్ధం జరిగింది. ఒండొరుల శస్త్రాల్ని ఒకరొకరు వమ్ము చేసికొన్న కొద్దీ పౌరుషం పెరిగింది. ఆ స్థితిలో గురువు ధృష్టద్యుమ్నుని రథాశ్వాల్ని సూతుడిని చంపాడు. ఈ సమయంలో ధృష్టద్యుమ్నునికి భీముడు సహాయంగా వచ్చాడు. మళ్ళీ వీరుభయులకు ఘోరమైన యుద్ధం జరిగింది. భీముడు కళింగపతిని ఎదుర్కొనే సమయంలో ధృష్టద్యుమ్నునికి ధర్మరాజు అండగా నిలిచాడు. తొమ్మిదవనాటి యుద్ధంలో ద్రోణాచార్యులతో అర్జునుడు యుద్ధం చేస్తాడు. ఈ యుద్ధంలో కృప శల్య బాహ్లికులు,అర్జునుణ్ణి ఎదుర్కొంటారు. భీష్ముని పదవనాటి యుద్ధంలో ద్రోణుడు . అశ్వత్థామను భీష్మునికి సహాయంగా పంపిస్తాడు.

సర్వసేనాధిపతిపట్టం:

భీష్ముని పతనానంతరం కర్ణుడు అతని దగ్గరకు పోయి భీష్ముని గొప్పతనాన్ని గుర్తు తెచ్చుకొని చాలసేపు చింతించాడు. అతని అనుమతితో రణరంగానికి బయలు దేరాడు. భీష్ముని తరువాత సకలసైన్యాధిపత్యాన్ని ఎవ రికివ్వాలా అని దుర్యోధనుడు ఆలోచిస్తున్నాడు. కర్ణుడు దుర్యో ధనుడు కలిసికొన్నారు. అప్పుడు కర్ణుడు దుర్యోధనునితో నీసైన్యంలో ప్రతి ఒక్కడు సర్వసైన్యాధిపత్యానికి అర్హుడే; కాని ఎవరు ఆ పదవిని అలంకరిస్తే ఎవరికీ అభ్యంతరం ఉండదో అట్టి వ్యక్తి ఆ పదవికి అర్హుడని చెప్పి యీ పదవికి ద్రోణాచార్యులు సమర్థుడని చెప్పాడు.అందుకు దుర్యోధనుడు అంగీకరించి ద్రోణునిదగ్గరకు వెళ్లి అతని అనుమతితో అతనిని సర్వసైన్యాధిపతిగా అభిషేకిస్తాడు. అందుకు సంతో షించిన కుంభసంభవుడు దుర్యోధనుని తనకు కావలసిన వరమేదైనా కోరుకోమన్నాడు. అప్పుడారాజరాజు కర్ణ దుశ్శాసనాదులతో సంప్రదించి ధర్మసుతుని ప్రాణాలతో పట్టి యివ్వమన్నాడు.

మళ్లా అరణ్యానికి పంపిస్తాను:

ఈ కోరికలో గూఢార్థం దాగిఉన్నదని శంకించిన ద్రోణుడు పాండవుల్ని ఓడించి వారికి అర్థ రాజ్యం యిస్తావా అని ప్రశ్నించాడు. అందుకు బదులుగా దుర్యోధనుడు, అతని అభిప్రాయం అదికాదని, మళ్ళీ జూదంలో ధర్మజుని ఓడించి, తిరిగి అరణ్యాలకు పంపటం తన అభిప్రాయమని చెప్పాడు. ఈదుష్టాలోచనకు బాధపడ్డ కుంభసంభవుడు, అర్జునుడు ధర్మజునికి ప్రక్కన లేకుండా వున్నా ధర్మజుడు పారిపోకుండా వున్నా, అతనిని పట్టి యిస్తానని వాగ్దానం చేశాడు.

ధర్మరాజు పట్టుబడ్డాడు:

మొదటిరోజున ద్రోణాచార్యులు శకటవ్యూహాన్ని పన్నాడు. దీనికి బదులుగా పాండవులు క్రౌంచవ్యూహాన్ని పన్నారు. యుద్ధకోవిదుడైన ద్రోణుడు పాండవసైన్యాన్ని నేలమట్టం చేశాడు. అప్పుడు ధర్మరాజు కౌరవసైన్యాన్ని చెల్లాచెదరు చేయటం మొదలు పెట్టాడు. ఇదే సమయమని ద్రోణుడు, ధర్మజుని పట్టుకోటానికి ప్రయత్నించాడు. ధర్మజుడు పట్టుబడ్డాడని హాహాకారాలు చెలరేగాయి. ఆ సమ

యంలో ఎక్కడనుంచో అర్జునుడు వరుగువవచ్చి గురువుని ఎదుర్కొని కౌరవసైన్యాన్ని చెల్లాచెదరు చేశాడు.

ఎలాగైనా పట్టుకుంటాను:

రెండవనాడు అర్జునుని దూరంగా తీసికొనిపోయి ధర్మజుని నుంచి వేరుచేయాలని ద్రోణుడు రాజరాజునకు సలహా యిచ్చాడు. అందుకు గాను అర్జునునితో యుద్ధం చేయటానికి దుర్యోధనుడు సంశప్తకులను పురికొల్పాడు. కాని అర్జునుడు ధర్మజునికి రక్షణ ఏర్పాటు చేసి సంశప్తకుల తోటి యుద్ధానికి వెళ్ళాడు. ఈ రెండవరోజు కౌరవులు గరుడవ్యూహాన్ని పాండవులు మండలార్ధ వ్యూహాన్ని వన్నారు. ఘోరమైన యుద్ధం జరిగింది. పాండవులు ఓడి పోతున్నారని దుర్యోధనుడు సంతోషించాడు. భగదత్తుడు తన ఏనుగుని ఎక్కి పాండవసైన్యాన్ని వంహరిస్తున్నాడు. ఆ సమయంలో అర్జునుడు సంశప్తకులను ఓడించి, ధర్మజునికి అండగా వచ్చి భగదత్తుని వధించాడు. ఇంతటితో కౌరవ సైన్యం కొంత భయపడ్డది. ఇప్పుడు పాండవసైన్యం విజృం భించి ద్రోణుని ఎదుర్కొన్నది. కాని ద్రోణుని ముందు, వారు

అగలేరు. ద్రోణుని ప్రతిజ్ఞ నెరవేరకుండానే ఆనాటి యుద్ధం ముగిసింది. శిబిరాలకు వెళ్ళేటప్పుడు దుర్యోధనుడు గురువుకు అతని ప్రతిజ్ఞను జ్ఞాపకం చేశాడు. ఎట్లైనా మరునాడు ధర్మజుని పట్టుకుంటానని గురువు చెప్పాడు.

ద్రోణుని పద్మవ్యూహం:

మూడవనాటి యుద్ధంలో ఆచార్య ద్రోణుడు పద్మ వ్యూహాన్ని పన్నాడు. ఈ వ్యూహాన్ని ఛేదించటం అర్జునుడికి తప్ప వేరెవరికి తెలియదు. చిన్నవాడైన అభిమన్యునికి లోపలికి పోవటం మాత్రమే తెలుసు కాని బయటకు వచ్చే పద్ధతి తెలియదు. అర్జునుడు అభిమన్యుని వ్యూహంలోకి దారి చేయమని చెప్పి ఆ తర్వాత అతని వెంట తామంతా లోనికి ప్రవేశిస్తామని చెప్పాడు.

సైంధవుని సంహరిస్తాను:

అభిమన్యుడు వ్యూహాన్ని ప్రవేశించాడు. తక్కిన పాండవులు ప్రవేశిస్తుండగా సైంధవుడు అడ్డువచ్చాడు. అందుకే అభిమన్యుడు ఒంటరిగా పోరాడి అలసిపోయాడు. ద్రోణుని

సూచన ప్రకారం కర్ణుడు అభిమన్యుని విల్లు విరిచాడు. మహా రథులందరు ఒంటరియైన అభిమన్యుణ్ణి చుట్టుముట్టారు. అప్పుడు అభిమన్యుడు దుశ్శాసనుని కుమారునితో గదా యుద్ధం చేస్తూ మరణించాడు. ఈ విషయాన్ని విన్న అర్జునుడు కుమారుని మరణానికి దుఃఖించి దీనికి కారకుడైన సింధురాజును మరునాడు సూర్యాస్తమయం లోపల సంహరిస్తానని ప్రతిజ్ఞచేశాడు. ఈ ప్రతిజ్ఞకు భయపడ్డ సైంధవునికి కుంభసంభవుడు, కర్ణుడు మొదలైనవారు ధైర్యం చెప్పారు.

చక్రవ్యూహంలో సైంధవుడు:

నాల్గవనాటి యుద్ధంలో ద్రోణుడు తెల్లని కవచాన్ని దానికి తగిన ఉష్ణీషాన్ని ధరించి కోపంతో ధనుస్సుని ఎక్కు పెడుతూ మహోగ్రుడై కన్పించాడు. ఆనాడు మహావ్యూహ మనే చక్రవ్యూహాన్ని పన్నాడు. ఈ వ్యూహంలో గర్భ వ్యూహంగా పద్మవ్యూహాన్ని పన్ని భూరిశ్రవుడు, అశ్వత్థామ మొదలైనవారు సింధురాజును కాపాడేట్లుగా నియోగించాడు.

ప్రదక్షిణం చేసి వ్యూహంలో ప్రవేశించు:

అర్జునుడు ధర్మజుని రక్షించటానికి సాత్యకిని నియోగించి రణోన్ముఖుడయ్యాడు. అప్పుడు ద్రోణాచార్యులు

నన్ను జయించకుండా ఏ విధంగా వెళ్ళగలవు? అని అర్జునునితో నవ్వుతూ అన్నాడు. దీనిలోని అంతరార్థం తెలిసి కొన్న కృష్ణుడు, అర్జునునితో నీవు ఈతనితో యుద్ధం చేస్తుంటే ఈ రోజంతా వృథా అవుతుంది. కనుక ఇతనికి ప్రదక్షిణం చేసి వ్యూహంలోకి ప్రవేశించు! అని సలహా చెప్పాడు. ఆ ప్రకారంగానే అర్జునుడు ఆచరించాడు. కౌరవ సైన్యాన్ని చిందరవందర చేసి యోధుల్ని ఎంతమందినో చంపాడు.

సూర్యుడికి చక్రం అడ్డు:

ఒంటరిగా వ్యూహాన్ని ప్రవేశించిన తమ్ముని విషయంలో దిగులువడ్డ ధర్మరాజు సాత్యకిని అతనికి తోడుగా పంపాడు. మరికొంతసేపటికి భీముని పంపాడు. వీరు ముగ్గురు యుద్ధనైపుణ్యాన్ని చూపుతూ సింధురాజు దగ్గరికి సాగిపోయారు. వీళ్లను అడ్డగించటానికి రారాజు అర్జునాదుల వైపు పరిగెత్తాడు. సాత్యకిని చంపటానికి భూరిశ్రవుడు తనచేతిని ఎత్తగా దాన్ని అర్జునుడు కృష్ణ ప్రేరితుడై ఖండించాడు. సాత్యకి భూరిశ్రవుని శిరస్సు ఖండించాడు.

అప్పటికి చాలపొద్దు గడిచింది. సైంధవుడు హతుడుకాలేదు. అతనిని చేరకుండా కౌరవులు పాండవుల్ని అడ్డగిస్తున్నారు. అప్పుడు ఒక ఉపాయం పన్ని కృష్ణుడు తన చక్రం సూర్యునికి అడ్డంపెట్టి కృత్రిమంగా చీకటిని కల్పించాడు. ఈ చీకటిని చూసి సంతోషించి ధైర్యంగా సైంధవుడు తల బైటికి పెట్టాడు. కృష్ణుడు సంజ్ఞ చేయగా అర్జునుడు వెంటనే సైంధవుని తల నరికాడు.

తెల్లవార్లూ యుద్ధం:

తరువాత సంధ్యాకాలం అయినప్పటికీ యిరుపక్షాలు యుద్ధాన్ని ఆపలేదు. దివిటీలుపెట్టి యుద్ధాన్ని సాగించారు. సైనికులు బాగా అలసి వుండటం గమనించిన పార్థుడు విరామం ప్రకటించి చంద్రోదయం అయిన తరువాత యుద్ధం చేయవచ్చన్నాడు. అందుకు అందరు అంగీకరించారు. ఆ విధంగానే ఆనాడు తెల్లవార్లు యుద్ధం జరిగింది. ఆనాడు ఘటోత్కచుడు కర్ణుని శక్తితో మరణించాడు.

అశ్వత్థామా హతః; కుంజరః:

అయిదవనాటి యుద్ధంలో ద్రోణాచార్యులధాటికి తాళ లేక పాండవబలం వరుగెత్తింది. తీవ్రమైన అస్త్రాల్ని

వ్రయోగించి ద్రోణుడు చాలమంది వీరుల శిరస్సుల్ని ఖండించాడు. విరటుడు, ద్రుపదుడు అతని అస్త్రాలతో మరణించారు. ఆచార్యుల యుద్ధవిజృంభణానికి ఎవరూ ఆగలేక పోయారు. ఎదిరించి యుద్ధంలో అతన్ని జయించటం కష్టమని ఏదైనా మాయోపాయంతోనే అతన్ని జయించాలని కృష్ణుడు సలహా యిచ్చాడు. ఆ సలహాననుసరించి ద్రోణుని కుమారుడైన అశ్వత్థామ హతుడయ్యాడని ధర్మజుని చెప్పమన్నారు. ఇందుకు ధర్మరాజు ఒప్పుకోకపోతే బలవంతంగా ఒప్పించాడు. అప్పుడు ధర్మరాజు ఆచార్యుల సాన్నిధ్యంలో "అశ్వత్థామా హతః" అని బిగ్గరగాను "కుంజరః" అని నెమ్మదిగాను అన్నాడు. బిగ్గరగా పల్కిన మాటలు విన్న ద్రోణుడు తన కుమారుడు మరణించాడని ఖిన్నుడై అస్త్రసన్యాసం చేసి కర్ణ, కృప, సుయోధనాదుల్ని పిలిచి,తెలివిగా యుద్ధం చేయమని సలహా యిచ్చి తన రథంపై యోగనిష్ఠతో కూర్చున్నాడు. ఆసమయంలో అర్జునాదులు వారించినా వినకుండా ధృష్టద్యుమ్నుడు ద్రోణుని శిరస్సు తన ఖడ్గంతో ఖండించాడు. అందుకు కోపించి అశ్వత్థామ నారాయణాస్త్రం

ప్రయోగించగా కృష్ణునిసలహా ప్రకారం పాండవులు అస్త్రాల్ని విసర్జించి దానికి మొక్కి ప్రాణాల్ని కాపాడుకొన్నారు.

వ్యక్తిత్వం:

ఈ విధంగా ప్రఖ్యాతిపొందిన భారతవీరుల్లో ఒక డైన ద్రోణాచార్యులు, సకలాస్త్రప్రవీణుడై భీష్మాదులనుంచి ప్రశంసల్ని పొందాడు. పరశురామునికి తగిన శిష్యుడని పించుకున్నాడు. తన శిష్యుడికి మర్మం లేకుండా విద్యలన్నీ నేర్పాడు. బ్రాహ్మణుడైనా "ఇదం బ్రాహ్మమిదం క్షాత్రం" అని నిరూపించి అజేయుడనిపించుకొని శాశ్వతుడయ్యాడు.

